# THIKKA KUDIRINDI

(ONE ACT PLAY)

By Itha Chandraiah

: రచయిత రంగస్థల రచనలు :

1. రోజులు మారాలి
(స్త్రీ పాత్రలేని హాస్య ఏకాంక నాటిక) రూ॥ 10/-

2. బుద్ధొచ్చింది
(హాస్య ఏకాంక నాటిక) రూ॥ 10/-

3. తిక్క కుదిరింది
(హాస్య ఏకాంక నాటిక) రూ॥ 10/-

4. నాలుగు ఏకపాత్రలు రూ॥ 10/-
(రామదాసు, సావర్కర్, డాక్టర్జీ మరియు వివేకానంద)

-: కవర్‌పేజి ముద్రణ :-
సరస్వతి ప్రింటర్స్, మార్కండేయ దేవాలయంరోడ్, సిద్ధిపేట.

స్త్రీ పాత్ర ఉండి లేని ఏకాంక నాటిక

# తిక్క కుదిరింది










ఐతా చంద్రయ్య

# తిక్క కుదిరింది

(స్త్రీ పాత్ర ఉండీ లేని హాస్యనాటిక)



ఐతా చంద్రయ్య



జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్ధిపేట

జాతీయ సాహిత్య పరిషత్తు - సిద్ధిపేట శాఖ
52వ కావ్య కుసుమము

ప్రథమ ముద్రణ : 1995.

ప్రతులు: 1000





వెల. రూ 10/-

హెచ్చరిక :-
ఈ నాటికను ప్రదర్శించాలంటే రచయిత అనుమతి పొందాలి

ప్రతులకు :
**ఐతా లింగమూర్తి**
S/o ఐతా చంద్రయ్య
ఇం. నెం. 4-4-11, శేర్‌పురా
సిద్ధిపేట - 502 103

ముద్రణ:
**ఓంసాయి గ్రాఫిక్స్**
నారాయణ గూడ
హైదరాబాదు.

# పాత్రలు

| | | |
|---|---|---|
| దయ్యాల్రావు | - | ధోతి (షర్టు ఉండదు) పైన కండువా. కంటికి అద్దాలు చేతిలో సంచి (45 సం॥) |
| గోపాలకృష్ణ | - | పెళ్లికొడుకు. నత్తి, మాటి మాటికి నోట్లో వేలేసుకుంటాడు వదులైన, వికారం గుడ్డలేసుకుంటాడు (28సం॥) |
| ఆగమయ్య | - | పెళ్ళికొడుకు తండ్రి. ధోతి, నెహ్రూ షర్టు ( 50 సం॥) |
| భజగోవిందం | - | పెళ్లి కూతురు తండ్రి. ధోతితో ఇన్‌షర్ట్, బెల్టు ( 50సం॥) |
| రుక్మిణి | - | పెళ్లికూతురు (25సం॥) |

నోటు :- రుక్మిణి పాత్ర కావాలనుకుంటే రంగస్థలం మీదికి
రావచ్చు లేకపోతే పక్క తెరలోంచి మాట్లాడవచ్చు.

రంగ స్థలం:

ఆగమయ్య ఇంటి వసారా. నాలుగు కుర్చీ
గోడలకు దేవతల కాలెండర్లు.

# తిక్క కుదిరింది (నాటిక)

- ఐతా చంద్రయ్య

ఆగమయ్య కుర్చీలో కూర్చునుంటాడు. దయ్యాల్రావు ప్రవేశం.

దయ్యాల్రావు : ఆగమయ్యా...ఓ ఆగమయ్యా! (ఒక సెకండాగి) ఆగమయ్యా..పలుకవేమిటీ? ...చూపులు.... శూన్యంలోకి...అదేమిటీ? ( చెవిలో గట్టిగా) ఆగమయ్యా...

ఆగమయ్య:- (జడుసుకుని) ఆఁ...దయ్యం...దయ్యం

దయ్యాల్రావు :- (జడుసుకుని) అమ్మోయ్! దయ్యమా! ఏదీ...ఎక్కడా?

ఆగమయ్య:- అబ్బో..నన్నొదలవయ్యా!...వొదులూ... ఆఁ...దయ్యం ఇదిగో, నువ్వే.

దయ్యాల్రావు:- (ఆశ్చర్యంగా) నేనా... నేను దయ్యాన్నా! అయ్య బాయోయ్...నేనింకా చావందే..! (తనలో తాను అనుమానంగా) కొంపదీసి చచ్చానా? ఏదీ నాకాళ్లూ.. చేతులూ (పైకి)కాళ్లు సరిగానే ఉన్నాయిగదండీ!

ఆగమయ్య:- నువ్వు చావక ముందే దయ్యాని వయ్యావు గదా!

దయ్యాల్రావు :- అదెట్లా...?

ఆగమయ్య :- నీపేరేందీ?

దయ్యాల్రావు :- నాపేరా...దయ్యాల్రావు

ఆగమయ్య :- అద్గదీ.. అందుకే..బతికుండి గూడా దయ్యమై నన్ను

దయ్యాల్రావు:- అయ్యోరామా! (దీనంగా+జాలిగా) మా నాన్నకు పట్టిన దయ్యం వొదిల్తే, పుట్టే కొడుక్కు దయ్యం పేరు బెట్టుకుంటామని మొక్కార్ట. మొక్కగానే నేను పుట్టానట. నేను పుట్టగానే మా నాన్ననిదయ్యమొది లిందటా. అందుకే నా పేరు దయ్యాల్రావని పెట్టార్ట. అంత మాత్రానికే చెట్టంత మనిషిని పట్టుకుని.. పట్టపగలు...దయ్యమంటారా? ఓయాభై రూపాయల కమీషన్ అడ్వాన్సివ్వమంటే పీడిస్తున్నానంటారా? ఇద న్యాయం... అక్రమం.. నా పెళ్ళిల్ల పేరయ్య వృత్తికే తీరని అవమానం...

ఆగమయ్య :- ఇలాంటి యాభైలెన్నిసార్లో లాగించావు గాని గుట్టంత నా కొడుక్కు ఓ చిట్టి సంబంధం ఖాయం చేశావా? (కోపంగా) చిత్త శుద్దిలేని వృత్తి ఎందుకయ్యా! ఇదిగో....నామాట విని, పెళ్లిల్ల బ్రోకర్ గిరీ మానుకుని భోనగిరి బస్టాండ్లో బోండాలమ్ముకోఫో...బాగుపడ్తావ్.

దయ్యాల్రావు :- ఓహ్ (నవ్వి) ఓహో! అదా మీ మంట! మీబోడి కొడుక్కోసం ఎన్ని జాడలు తీశానూ...ఎన్ని వాడలు తిరిగానూ..ఎన్ని మేడలు వెతికానూ...! ఎన్ని సంబం ధాలు దెచ్చినా...అమ్మాయి కబ్బాయి నచ్చితే అబ్బాయి కమ్మాయి నచ్చదు. అబ్బాయి కమ్మాయి నచ్చితే అమ్మాయి కబ్బాయి నచ్చుడు. ఇద్దరూ ఇష్టపడితే మీకు కట్నం నచ్చదు. మీరూ మీరూ ఏమైనా నాకష్టం తప్పదుగదా! అందుకే నా కమీషన్ నాకివ్వాల్సిందే గదా! కమీషన్ లేకపోతే నా బతుకు కాటికాడి పీనుగై పోతుంది గదా?

ఆగమయ్య :- అలాగన్ని...కమీషన్ మీద కమీషన్ లాగి నా ఇల్లు గుల్ల చేస్తావా? నేను లోపలి కెళ్లాలి... ఇక నువ్వెళ్లు..

దయ్యాలావు :- (గారాబంగా) కాస్తాగవయ్యా ఆగమయ్యా!

ఆగమయ్య :- నేనాగనయ్యా... నేనాగను (లేవబోతాడు)

దయ్యాలావు :- ఆయ్యో...మావిడ అర్జెంటుగా కాఫీ పొడి తెమ్మందండీ. చేతిలో చిల్లి గవ్వలేదు. కాఫీపొడి తీసికెళ్లకపోతే నాకాళ్లూ చేతులు నాకుండవండీ! అందుకనీ...ఒక్క పది రూపాయలూ...ప్లీజ్...

ఆగమయ్య :- (కోపంగా) పది పైసలు గూడా ఇవ్వను. నా ఏకైక పుత్రునికి పెళ్లి సంబంధం కుదుర్చకుండా పైసాలడిగితే. .పళ్లూడగొడ్తా (ఆయాసంతో) హబ్బబ్బబ్బా...రామా... కృష్ణా... నాప్రాణానికి దాపురించావయ్యా! (లేవ బోతాడు)

దయ్యాలావు :- (ఆగమయ్య భుజాలుపట్టి కూచోబెడుతూ) అలాగంటే...కుదరదంటే కుదరదు. మీరు కూచోండి. ఆయాసమొస్తున్నట్టుందీ... అలా కూచోండి... కుర్చీలనే ...ఆ...ఆ! అయ్యా! ముందే మీ కొడుక్కు ముక్కిడి. పదోతరగతి పదిసార్లు డింకీలు గొట్టె దానికి తోడు వరకట్నం గూడా కావాలంటే ఎలాగండీ?

ఆగమయ్య :- ఈ రోజుల్లో మగపుట్టుక పుట్టిన ఏ వెధవన్నా వరకట్నం లేకుండా పెళ్లి జేసుకుంటున్నాడా? వాడు మగాడైతే చాలు.. యాభైవేలు. పాంటు వేస్తే లక్షణంగా లక్ష... పదోతరగతి కళ్లజూస్తే రెండు లక్షలు...కాలేజీ గేటు దాటితే కనీసం...

దయ్యాల్రావు :- (చీదరింపుగా) నా పిండాకూడు! కట్నం భూతం ఈ చూరు పట్టుకు వేళ్లాడ్తుంది. ఇంటికి కోడలు రాకుండా చేస్తుంది. ఔనూ...నీకొడుకునేపిల్లైనా మనస్ఫూర్తిగా ఇష్టపడుద్దా? ఆమొహం జూస్తేనే పంచ మహాపాత కాలంటుకుపోతాయ్..సరే...వస్తా...(పోబోతాడు)

ఆగమయ్య :- (ఆపి) అయ్యో రామ... కాస్తాగవయ్యా((ఆయాసంగా) రామా..కృష్ణా...గోపాలకృష్ణా...

గోపాలకృష్ణ :- (ఖుషీగా) నేనొచ్చా. పి..పి..ప్పి... ప్పిల్చారా నాన్నా? (నోట్లో వేలేసుకుంటాడు)

దయ్యాల్రావు :- ఓహో... నీపేరు గోపాలకృష్ణ గదూ. అదేమిటోయ్ పెళ్లికొడుకా... ఆనోట్లో వేలేమిటీ ... ఆ అవతార మేమిటీ?... మీ నాన్న పిల్చింది నిన్నుగాదు. ఆ ద్వాపరయుగం నాటి గోపాకృష్ణుడ్ని.

గోపాలకృష్ణ :- అలాగా...! నాకోసం పె...పె...ప్పె... ప్పెళ్లి కూతుర్ని తీసుకొచ్చారనుకున్నా. నా అవతారానికేమైందీ? అచ్చం సి..సి..స్సి..స్సినిమా యాక్టర్లా లేనా?

దయ్యాల్రావు :- (తనలో) నీబొంద! చచ్చు దద్దమ్మలా గున్నవ్ వెధవా! (పైకి) ఐతే మాత్రం పెళ్లి కూతుళ్లు నిన్ను వెతుక్కుంటూ వస్తారా? నువ్వో ఇంటివాడివి కావాలని మీ నాన్నగారు తెగ ఇదైపోతున్నారు నాయనా?

గోపాలకృష్ణ :- (గారాబంగా) ఆనలూ...నాకూ...గో...గో...గ్గో... గ్గోపాలకృష్ణుడని పేరు బెట్టి...ఒక్క గోపికను గూడా చూసిపెట్టలేదెందుకూంటా! మరే ఎ...ఎ...య్యె... య్యెమర్జంట్‌గా మా ఇంటికి దీపం ఇల్లాల్ని వెతికి పెట్టాలీ...ఆc...(కుర్చీలో కూచుంటాడు)

ఆగమయ్య :- (ఆలోచనతో బాధగా) ఔనయ్యా దయ్యాలూ...! మా వాడికి పెళ్లీడొచ్చిందనే గదా నేను రెండో పెళ్లి చేసుకోంది.

దయ్యాల్రావు :- (తనలో) ఓహో...ఈ మారేడు కాయ ఫేసుకు మరో పెళ్లా... బోడి మొహమా!

గోపాలకృష్ణ :- (లేచి) అదేంగాదు. అమ్మ త....త...త్త...త్తంతుందనీ... బయ్యం...(కూచుంటాడు)

ఆగమయ్య :- (తనలో) వీడు నాపరువు పంచనామా చేస్తున్నాడు. (పైకి) అబ్బా...ఏదో ఒకటి లేరా! కోడలు లేక ఈ ఇల్లు ఎంత బోసి బోయిందో అని బాధపడ్తుంటే...

దయ్యాల్రావు :- బోసిదైతే నాకేం...బోడిదైతే నాకేం! మీ గోపాలకృష్ణకో సత్యభామ దొరకలేదనే గదా మీ శ్రీమతి ధుమధుమ లాడేదీ... మీకేమో కట్నం దయ్యం బట్టిందాయె.

ఆగమయ్య :- (కోపంగా లేచి) దయ్యాలయ్యా ! నీకో దండం గానీ నాకు బుద్ధులు జెప్పడం మానేసి బుద్ధిగా మా వానికో పిల్లంజూడవయ్యా ! ఇదిగో... పిల్లతో పాటు ముల్లె గూడా.... అక్కడ జూపు నీ ప్రతాప మంతా! అప్పుడు నీ కమీషన్ అణాపైసల్తో సహా పుచ్చేసుకో. (లేచి కండువా దులిపి కూచుంటాడు)

దయ్యాల్రావు :- (ఏడుపు నటిస్తూ) ఐతే....మీవాడికో పిల్ల దొరికే దాకా మా ఇంట్లో కాఫీ కరువేనా?

ఆగమయ్య :- కాఫీ ఏమిటీ... కలాకందు చేస్కో! కానీ... అడ్వాన్స్ మాటెత్తితే అబోరు దక్కదు.

దయ్యాల్రావు :- అంతేనా... మరి పిల్లా కావాలీ, ముల్లే కావాలీ అంటే ఎలాకుదురుద్దీ? (కోపంగా) మీ ముదనష్టపు ముద్దుల కొడుక్కి, నత్తి వెధవకు, సుత్తిగాడికి ,లక్షల వరకట్నమా? ఇంకా రెండేళ్లిట్లే గడిస్తే... పెళ్ళి సంగతి పెరుమాళ్ళ కొదిలేసి వాడు సన్యాసుల్లో కలవడం గ్యారంటీ. చిరతలు పుచ్చుకుని భజగోవిందం, భజగోవిందం, గోవిందం...భజగోవిందం అంటూ...

భజగోవిందం :- (ప్రవేశిస్తూ) ఆఁ...ఆఁ...వస్తున్నా, వస్తున్నా... వచ్చేశా.. (అందర్ని ఆశ్చర్యంగా చూస్తాడు).

ఆగమయ్య :- (తనలో) వీడెవడబ్బా? (పైకి) అరెరే... ఎవరు మీరూ? ఎందుకొస్తున్నారూ?

భజగోవిందం :- (ఖుషీగా) నేనా... నాపేరు భజగోవిందం. అదిగో... ఆయన పిల్చాడు గదా... వచ్చేశా. నన్నెవ్వరైనా అలా పిలిస్తే ఇలా వచ్చేస్తా (దర్జాగా కూచుంటాడు)

దయ్యాల్రావు :- (కంగారుగా) భజగోవిందం గారూ! మీరెందుకొచ్చారూ ... ఏం దెచ్చారూ?

భజగోవిందం :- నువ్వు తేలేనిది.

ఆగమయ్య :- (ఆలోచనగా) దయ్యాల్రావు తేలేని దేమిటబ్బా...ఒక్క పెళ్ళి సంబంధం తప్ప...

భజగోవిందం :- అదే తెచ్చా...అదిగో అటుచూడండి...అటు చూడండయ్యా....

గోపాలకృష్ణ :- (ఆశ్చర్యం + సంతోషం) ఆఁ....ఓ...ఆడపిల్లా....(పెదాలు తడిపేసుకుంటూ) బా...బా...బ్బా...బ్బావుంది... చాలా

బావుంది.. ముఁ..ముఁ...ముద్దబంతి పువ్వోలుంది. అరె...అక్కడే నిల్చుందేం! లోపలికి రమ్మనండీ....(నోట్లో వేలు)

భజగోవిందం :- రామ్మా...రా..లోపలికిరా!

రుక్మిణి :- (సిగ్గుగా) అబ్బో....నాకు సిగ్గునాన్నా ...నేర్రాను.

ఆగమయ్యా :- (తనలో) దీని సిగ్గు బొగ్గైపోనూ... అడపిల్లే...పెళ్లీడు పిల్ల..కుందనబ్బొమ్మా!

దయ్యాల్రావు :- (తనలో) వీడి దుంపదెగా!.... కూతుర్ని వెంటేసు కొచ్చాడే!... కొంపముంచేలాగున్నాడు. (పైకి) ఏమ్మా... ఏంముంచుకొచ్చింది? ఎందుకొచ్చారిక్కడికీ?

రుక్మిణి :- అ...మ్మో...! నాకు సిగ్గేస్తుందండీ... నేంజెప్పను.

దయ్యాల్రావు :- నీ సిగ్గు సిగదరగా!

భజగోవిందం :- ఈ అమ్మాయి మా అమ్మాయే. పేరు రుక్మిణి. పెళ్లీడు కొచ్చిన పిల్లగదూ! ఈ దయ్యాల్రావే సంబంధాలు వెతుకుతున్నాడు. అదిగో, ఇదిగో అంటూ కమీషన్ లాగిస్తున్నాడే తప్ప కన్యాదానం దాకా తేవడం లేదు.

దయ్యాల్రావు :- అన్యాయం....చాలా అన్యాయం... మీ అమ్మాయి గ్గూడా చాలా సంబంధాలు చూశానుగదా! కాని... బంగారం లాంటి సంబంధాలన్నీ బోడికట్నం దగ్గరే ఎగిరిపోతున్నె. ఈ కలియుగంలో గూడా కన్యాశుల్క మిస్తేనే కన్యాదానం చేస్తానంటే కుదిరే పనేనా...?

భజగోవిందం :- కుదురుగ్గా నచ్చజెప్పాలి గానీ కుదరేకేం జేస్తుందీ? కన్యాశుల్కమేమన్నా కొత్త పద్ధతా? అమ్మాయిని కనీ, పెంచి పెద్దజేసి చేతిలో పెడ్తున్నందు కామాత్రం కృతజ్ఞత ఉండాలి గదా!..

దయ్యాల్రావు :- మీ రుక్మిణమ్మకు చూచినన్ని సంబంధాలు నేనెవ్వరికీ చూడలేదు. ప్రతికేసులో సగం కమీషన్ సున్నా బెడ్తున్నరాయె.

ఆగమయ్య :- ఆ సున్నా సంగతి సరేగానీ... వీరు ఎవరి మొహానికి సున్నమేసేందుకొచ్చారూ?

భజగోవిందం :- శుభమాంటు సంబంధం తీసుకొస్తే సున్న మంటా రేమిటీ? ఆగమయ్య పేరు సార్థకమన్న మాటా...

ఆగమయ్య :- ఐతే నాపేరు తెలుసుకొనే వచ్చారన్న మాటా..

భజగోవిందం :- పేరేకాదు, ఇంటినెంబరూ, వీధిపేరూ,..మిగితా వివ రాలన్నీ ఈ దయ్యాల్రావే ఇచ్చాడు. మా అమ్మాయిని మీ అబ్బాయికిచ్చి పెళ్ళి....

గోపాలకృష్ణ :- ఓహ్...ని...ని...న్ని...న్నిజ్జమా! (అమితానందం) బలేబలే...ఈ అమ్మాయితో నాపె..పె...ప్పె...ప్పెళ్లంట. ఒహో నా పెళ్లంట, అహానా పెళ్లంట, లోకమెల్ల గో..గో...గ్గోలంట టాంటాంటాం...లోపలికి రమ్మను నాన్నా (నోట్లో వేలు)

రుక్మిణి :- నాకు సిగ్గేస్తుందండీ...నేన్రానంటే....

దయ్యాల్రావు :- (తనలో) ఓర్నాయనో...నా కమీషన్ గోవింద గొట్టేట్టుందే...(పైకి) అయ్యా...భజగోవిందయ్యా! మీ

అమ్మాయికి ఈ సంబంధం కుదర్చాలనే నేనొచ్చిం దిక్కడికి. మీకెందుకీ శ్రమా?

భజగవిందం :- (వెటకారంగా) నీమీద విశ్వాసం పొంగి పొర్లి కాలువై పారింది. ఆ కాలువ వెంట నువు జెప్పిన అడ్రసు వెతుక్కుంటూ వచ్చామంతే.

దయ్యాల్రావు :- (బాధగా) ఏమ్మా... రుక్మిణమ్మా... అమాయకుణ్ని ...అర్భకుణ్ని, ఆడపిల్లల తండ్రిని...కమీషన్‌తోనే కడుపునింపుకునే కాటి కాపర్ని... నామీద అనుమాన మొచ్చిందా తల్లీ!

గోపాలకృష్ణ :- (చిరుకోపంగా) నాన్నా...(సిగ్గుపడుతూ) రుక్మిణి చా...చా...చ్చా...చ్చాలా బావుంది నాన్నా! అదో...ఆహా... నన్నే చూస్తుందినాన్నా! (గారాబంగా) ఊ...ఊ... రమ్మనునాన్నా....(నోట్లో వేలు)

భజగోవిందం :- రుక్మిణమ్మా....రామ్మా....వచ్చి అలా కూచో. ఈ ఇంటకి రాబోయే కోడలివి. నీక్కాబోయే భర్తను జాగ్రత్తగా చూచుకోమ్మా!

రుక్మిణి :- ఎట్లా వచ్చేది నాన్నా...ఛీ ....నాకు సిగ్గా...

గోపాలకృష్ణ :- అబ్బో...సిగ్గి.... న....న....న...న్న..న్ను జూస్తే సిగ్గా? ఆఁ.... నాగ్గూడా సిగ్గేస్తుంది. (ముందుకుపోబోతాడు)

దయ్యాల్రావు :- (ఉడికి పోతూ ఆపేస్తాడు) నువ్వ కాస్తాగవయ్యా...

ఆగమయ్య :- (కోపంగా) వాడెందుకాగాలయ్యా!

దయ్యాల్రావు :- అయ్యా! పెళ్ళి నంబంధాలు... అబ్బాయి అమ్మాయింటికెళ్లి చూడ్డం అనవాయితీ గదా! అమ్మాయే అబ్బాయింటికి రావడమంటే ప్రవాహం

పల్లంనుండి ఎత్తుకు ప్రవహించినట్టేగదా! (వెర్రిగా) అది ఆచారం కాదుగదా! నామాట వినండీ...

భజగోవిందం :- ఓహో! నీమాటంటే ఉప్పునీళ్ళ మూటనేకదా! అబ్బాయింటికమ్మాయి వెళ్లినా, అమ్మాయింటి కబ్బాయి వెళ్లినా...చూచుకునేదీ, పెళ్లిచేసుకునేదీ వాళ్లేగదా!

గోపాలకృష్ణ :- (మరింత సిగ్గుపడ్తూ) అ...ది...గో.... అద్గదిగో.. ఆ అమ్మాయి న...న....న్న...న్నన్ను రమ్మంటుంది నాన్నా! (ఖుషీగా) ఎంచక్కా మేము కబుర్లాడుకుంటామక్కడే....

ఆగమయ్య :- (తనలో) వీడటువెళ్తే కట్నం తేలికై పోవచ్చు. (పైకి) నువ్వలా కూచోరా...లేవకూ....! (కోపంగా) అలా కూచో మంటే నీగ్గాదూ చెప్పేదీ!

రుక్మిణి :- (పాటలా పాడుతుంది)

రారా కృష్ణయ్యా రారా కృష్ణయ్యా!

ఊసులాడుకుందాము రారాకృష్ణయ్యా!

రారాకృష్ణయ్యా...రారాకృష్ణయ్యా!

బాసలాడుకుందాము రారాకృష్ణయ్యా!

గోపాలకృష్ణ :- ఆఁ....అదో...నన్నే....నన్నే పి...పి...ప్పి...ప్పిలుస్తుంది నాన్నా ! (సినిమాటిగ్గా) వెళ్తున్నాను. (వెళ్తూ) నేను వెళ్తున్నాను. ఓ...కే..టట్టడా....టాటా....

భజగోవిందం :- పోనీలెండి. ఎంతైనా కాబోయే చిలకాగోరింకలు గదా అక్కడే కూచుండి మాట్లాడు కుంటారు.. మాట్లాడ కోనీ!

ఆగమయ్య :- (నిస్సహాయంగా లేచికూచుంటాడు) అంతేనంటారా... సరే....!

దయ్యాలరావు :- వెళ్లాడు...అబ్బాయి కాస్తా అమ్మాయి దగ్గరి కెళ్లాడు. ఇంకేముంది వాళ్లిద్దరూ మాట్లాడుకుంటారు. చెట్టాపట్టాలేసుకు తిరుగుతారు. పెళ్లైపోతుందీ.. మరి నాకమీషన్ సంగతేమిటీ? (లేవబోతాడు).

భజగోవిందం :- (కోపంగా) నీ కమీషన్ కాటికెళ్లా. కూచో, ఆఁ...ఇప్పుడు చెప్పండి ఆగమయ్యగారూ!...మా అమ్మాయి ఉద్యోగం చేస్తోంది. మీ అబ్బాయేం జేస్తున్నాడూ? ఎంత సంపాదిస్తున్నాడూ?

దయ్యాలరావు :- (వ్యంగంగా) గోపాలకృష్ణుడుగదా... గొప్ప పనులే చేస్తుంటాడు.

భజగోవిందం :- అంటే....

ఆగమయ్య :- ఆరైగా పంజేస్తున్నాడండీ...

భజగోవిందం :- (సంతోషంగా) ఆహా... రెవిన్యూ ఇన్స్పెక్టరా? దివ్యంగా ఉంటుంది (తనలో )కన్యాశుల్కం రాలితీరుతుంది.

దయ్యాలరావు :- ఆరై అంటే... రెవిన్యూ ఇన్స్పెక్టర్ కాదు.

భజగోవిందం :- (ఆశ్చర్యంగా) మరీ....

దయ్యాలరావు :- రోడ్ ఇన్స్పెక్టర్. టి.టి.డి డిపార్ట్మెంటు లోనండీ.

భజగోవిందం :- (మరింత సంతోషంగా) ఓహో...ఆహా... తిరుమల తిరుపతి దేవస్థానంలో ఆర్ అండ్ బి వింగ్ ఉంది గదూ! భలే బాగుంది.

దయ్యాల్రావ్ :- ఆర్ అండ్ బి అంటే రోమియోస్ అండ్ బేవర్స్ అన్నమాట.

భజగోవిందం :- (ఆశ్చర్యంగా) మరి...టి.టి.డి అంటేనో!

దయ్యాల్రావు :- టి.టి.డి. అంటే (స్టైల్‌గా) తినడం, తిరగడం, దెబ్బలాడ్డం.

భజగోవిందం :- (సంతోషంగా) ఐతే... లక్షలరూపాయల కన్యాశుల్కం లక్షణంగా ఇచ్చుకోవాల్సిందే.

ఆగమయ్య :- (చాలా ఆశ్చర్యంగా) ఆఁ...కన్యాశుల్కమా!? మానాయనే...మీరే శతాబ్దంలో ఉన్నారూ? (గుండెమీద చెయ్యేసుకుంటాడు)

భజగోవిందం :- అలా గుండెమీద చెయ్యేసుకుంటె గుండాగుతుంది. ఇది ఏ శతాబ్దమైతేనేమి? కొన్ని దశాబ్దాల క్రితం కాన్యశుల్కమున్నదే గదా? అది చాలా పాతది.

దయ్యాల్రావు :- గోవిందా...గోవిందా! నా కమీషన్ గోవిందాయ మంగళమేనా?

ఆగమయ్య :- ఐతే....కన్యాశుల్కమివ్వాలా? అదేం కుదరదూ... మాకే వరకట్నమివ్వాలి. (గర్వంగా) మావాడు మగాడండీ... మీసమున్న మగాడు.

భజగోవిందం :- మీసమున్నా కీసమున్నా సంపాదనేముందనీ? (మరింత గర్వంగా) మా అమ్మాయి ఆడదండీ.. రోషమున్న ఆడదీ... ఎంచక్కా ఉద్యోగం చేసి సంపాదిస్తుంది తెల్సా..

ఆగమయ్య :- అదీ టి.టి.డి. బాపతేనా?

భజగోవిందం :- కాదు స్వామీ... ఐ.టి.డిలో.

ఆగమయ్య :- ఐ.టి.డీయా? అది డిగ్రీయా, డిపార్ట్‌మెంటా?

భజగోవిందం :- డిపార్ట్ మెంటేనండీ. ఇన్‌కంటాక్స్ డిపార్ట్ మెంటండీ.

దయ్యాల్రావు :- (ఏడుపుతో) అయ్యలూ... మీరింత లోతుల్లోకి వెళ్తున్నారంటే.. నా కమీషన్ కెసరు బెడ్తున్నట్టేనా? అమాయకుణ్ణి... అర్భకుణ్ని...ఆడపిల్లల....

ఆగమయ్య :- (చిరుకోపం) కాస్తాపవయ్యా నీకాకిగోల! పెద్ద మనిషితో మాట్లాడ్తుంటే పానకంలో పుడకలా ఊడిపడకూ...

దయ్యాల్రావు :- నిన్నటిదాకా నేనే దిక్కన్నారూ...

ఆగమయ్య :- ఆయన నణుగుడుకేంగానీ....మీ అమ్మాయి ఉద్యోగమ్మీద ఇంతవరకెంత సంపాదించిందీ?

భజగోవిందం :- (గర్వంగా) నెల జీతం...మూడు వేలు... మిగితా ఆదాయం నెలకూ...రెండు వేలూ... ఆ అంతా కలిసి గత ఐదేళ్లనుండి సుమారో ఐదు లక్షలు సంపాదిం చింది.

ఆగమయ్య :- ఐతే ... ఓమూడు లక్షల్ని వరకట్నంగా సమర్పించుకోండి.. ఆడపిల్లసంపాదన..అగ్గితో సమానం. అది మీకు జీర్ణంగాదు.

భజగోవిందం :- ఓహో... ఏం బుర్రండీ (కాలుమీద కాలేసుకుని) ఐతే...ఆరూట్లో వచ్చారా! అదేం కుదరదు. మా అమ్మాయి మరో పాతికేళ్లైనా ఉద్యోగం జేస్తుంది. ఈ ఉద్యోగ కాలంలో సుమారు కోటిన్నర రూపాయలన్నా సంపాదించి మీకిస్తుంది. అదంతా నాకొద్దు గానీ... ముచ్చటగా ఓ మూడు లక్షల రూపాయల కన్యాశుల్కమిప్పించండి. సరిపెట్టుకుంటా.

దయ్యాల్రావు :- (కోపం+బాధ) గోవిందా. గోవిందా (ఇద్దరికీ నమస్కరిస్తూ) నా కమీషన్ సంగతి ముందు తేల్చండి మహాప్రభూ!

ఆగమయ్య :- (కోపంగా) కమీషన్ లేదూ, కాకరకాయ లేదూ... ఫోవయ్యా...!

భజగోవిందం :- ఆ దయ్యమ్మీద కోపమెందుగ్గానీ...ముందు కన్యాశుల్కం సంగతి తేల్చండి.

ఆగమయ్య :- తేలాల్సింది కన్యాశుల్కం సంగతి కాదు, వరకట్నం సంగతే.

భజగోవిందం :- కాదు...కన్యాశుల్కమే

ఆగమయ్య :- ఊహుం....వరకట్నమే!

భజగోవిందం :- (గట్టిగా) కన్యాశుల్కమే (లేచినిల్చుంటాడు)

ఆగమయ్య :- (మరింతగట్టిగా) వరకట్నమే (లేచినిల్చుంటాడు)

దయ్యాల్రావు :- (దిగ్గున లేచి) ఆ రెండూ కాదు. ముందు తేల్చాల్సింది నా కమీషన్ సంగతే.

ఆగమయ్య :- నీ పిండాకూడుగానీ... ముందవతలికి పోతావా లేదా...(ఆగమయ్య, భజగోవిందం కూర్చుంటారు)

దయ్యాల్రావు :- (కూచుంటూ) అద్సరే గానీ అయ్యలూ....ఇంకా అబ్బాయీ, అమ్మాయీ మాట్లాడుకోవడం కాలేదా?

ఆగమయ్య :- (తగ్గి) అరెరే...కాస్త చూచిరావయ్యా...

దయ్యాల్రావు :- (తనలో) ఓహో... ఇందుకు పనికొస్తానా? (లేచివెళ్తూ పైకి) చూస్తాను...చూడకేం జేస్తానూ? ఛస్తానా? చూడకపోతే నా కమీషన్ కరీంనగర్ మురికి కాల్వలో కలిసిపోదా!

ఆగమయ్య :- హద్దదీ! ఇంతకీ ఈ దయ్యాల్రావు కమీషనెంతిస్తాం గోవిందా?

భజగవిందం :- (కోపంతో) నాపేరు గోవిందగాదు. భజగోవిందమని

చిలక్కి చెప్పినట్టు చెప్పానా.. మరో సారలా గంటే ఊరుకునేది లేదు...ఆఁ...

ఆగమయ్య :- ఊరుకోకుంటే ఉరేసుకుంటారా? (చిరుకోపం) ఓయ్...మేము మగపెళ్లి వాళ్లం తెల్సా!

భజగోవిందం :- మాటలు జాగర్తగా రానీ! మేము ఆడపెళ్లి వాళ్లం (గర్వంగా బల్లా గుద్ది) నేను అమ్మాయి తండ్రిని. నీ కొడుక్కు కూడూ, గుడ్డా ఇవ్వబోయే రుక్మిణి తండ్రిని, నీముక్కు పిండి మూడు లక్షల రూపాయల కన్యాశుల్కం వసూలు చేసే మొండిఘటాన్నని గుర్తుంచుకోవాలి.

ఆగమయ్య :- ఆహాహా (నవ్వి) నా దగ్గర కన్యాశుల్కం వసూలు చేసే దమ్ములున్నాయా? (మళ్లీనవ్వి) ఇదిగో చూడు... నీ ముక్కూ, చెవులూ, మూడు చుట్లు తిప్పి, మూడు చెరువుల నీళ్లు తాగించి మూడు లక్షల రూపాయల కట్నం వసూలు చెయ్యకపోతే...నాపేరు (మీసం మీద చెయ్యేసి) ఆగమయ్య కానేకాదు.

భజగోవిందం :- అలాగేం! (మీసందిద్దుతూ) నీకు మొట్టికాయలు వడ్డిస్తూ మూడు సముద్రాల నీళ్లు దాగించి మూడు లక్షల రూపాయల కన్యాశుల్కం వసూలు చెయ్యకపోతే నాపేరు.....

దయ్యాల్రావు :- (కంగారుగా వచ్చి) గోవిందా...గోవిందా! అబ్బాయీ లేడు, అమ్మాయీ లేదు. ఇదిగో ఈ ఉత్తరం మాత్రముంది. హా దేముడా...నా కమీషనేమైపోతుందో ఏమో!

భజగవిందం :- (కంగారుగా లేచి) నీ కమీషన్ కాట్లో కెల్లా... మా అమ్మాయేమైందీ? ఆ ఉత్తరమిలాతే...

ఆగమయ్య :- (కంగారుగా లేచి) అయ్యో... మా అబ్బాయేమై పోయాడూ దయ్యాలూ.... ఆ ఉత్తరమిలాతే... (చెరోప్రక్క నుండి లాక్కోబోతారు)

దయ్యాల్రావు :- (కోపంతో) ఎవ్వరికీ ఇవ్వను. (గర్వంగా) ఇవ్వనంటే ఇవ్వనంతే.

భజగోవిందం +
ఆగమయ్య :- (భయం+ కంగారు) మరేం జేస్తావ్... చించేస్తావా?

దయ్యాల్రావు :- (స్టైల్‌గా) హమ్మ్మా... చించేస్తే నాకేమొస్తుందీ చింకి గుడ్డా! ముందు మీరు చెరో ఐదొందల రూపాయల కమీషన్ నాచేతికివ్వండి ......ఊ.... త్వరగా....(ఒక్క సెకండాగి) ఆఁ.... ఇవ్వరా....ఇవ్వకపోతే ఈ ఉత్తరాన్ని శుబ్బరంగా నమిలి మింగేస్తా ఆఁ. ఊఁ.... త్వరగా...రానీ,....

భజగోవిందం :- ఓర్నీ కమీషన్ దొంగలు దోలా! నాకూతురయ్యా.. మూడులక్షల కూతురు...

ఆగమయ్య :- అయ్యయ్యో.... నాకొడుకయ్యా! మూడు లక్షల కొడుకూ.

దయ్యాల్రావు :- ముందు నా కమీషన్, ఆ తర్వాతే కమ్యూనికేషన్... తినేస్తున్నా...ఉత్తరం తినేస్తున్నా....(నోటి వద్ద ఉత్తర ముంచుకుని, ఇప్పుడే తినేస్తున్నా...

భజగోవిందం :- (భయంగా) వద్దొద్దు...ఇదిగో నీ కమీషన్ ఐదొందలు... తీస్కో... తీ...సు....కో...ఆఁ... (ఐదువందల నోట్లిస్తాడు)

ఆగమయ్య :- (కసిగా) ఒరేయ్ దయ్యమా! అన్నంత పంజేశావురా.... ఇదో...నా ఐదొందలూ...ఆఁ...తీస్కో (ఐదువంద లిస్తాడు) ఇహ ఆ ఉత్తరం చదువూ!

దయ్యాల్రావు :- (గట్టిగా ఊపిరి పీల్చుకుని) హమ్మయ్య.... అలా రావాలి దారికి. వెరీ గుడ్...ఇదిగో (డబ్బు బొడ్లో దాచుకుని) ఉత్తరం విప్పుతూన్న.... అఁ....ఇక వినండి

ప్రియమైన నాన్నాలూ...నమస్కారాలు... (కోపంతో) మీ మొహాలు మండా...మీకు శ్రార్ధం బెట్టా....

భజగోవిందం :- (రోషంతో) నీకేమన్నా పిచ్చెక్కిందా...

ఆగమయ్య :- (కోపంతో) ఐదొందలు లాగేసి అట్లా తిడతావెందు కయ్యా ... ఉత్తరం చదూ...

దయ్యాల్రావు :- (కోపం +స్టైల్) అబ్బా అదంతా ఉత్తరంలో ఉన్నదే చదివా... ఇంకా వినండి అఁ... వెధవాయల్లారా! మేమిద్దరం మనసులు విప్పి మాట్లాడుకున్నాం. ఇన్‌స్టాంట్‌గా ప్రేమించుకున్నాం. మమ్మల్ని అమ్ముకోవాలనుకున్న మీకు చిక్కకుండా ఇప్పుడే చక్కా మాదారి మేము చూచుకుంటున్నాం. ఇంతే సంగతులు

-ఇట్లు

మీ

**గోపాలకృష్ణ అండ్ రుక్మిణి**

**ఆగమయ్య + భజగోవిందం :-** అఁ ...అయ్యో.... (కుర్చీల్లో కూలబడతారు)

దయ్యాల్రావు :- (కసి+కోపం+ఖుషీ) తిక్కకుదిరింది. రెక్కలొచ్చిన పక్షులు ఎంచక్కా ఎగిరిపోయినై. నేనొస్తా.... టా... టా...ఢీ...రి...యో... (తెరలోకి వెళ్తాడు)

***